







అనేక భాషలు జీర్ణించుకొన్నవాడు
అనేక సాహిత్యములు ఆకళించుకొన్నవాడు
భారతదేశమంతయు తిరిగినవాడు
వేల సన్మానములందినవాడు
సంగీత సాహిత్యములలో దిట్ట
అతులిత శేముషీ విభావితుడైన వక్త
సాహితీ మహామేరువు
నూటికి పైగా గ్రంథములు వ్రాసినవాడు
వ్రాసిన పంక్తి అంతయును వెలగలవాడు
సాహిత్యములో అన్ని పోకడలుపోయినవాడు
గతమును మరువనివాడు
భావి నాహ్వానించినవాడు
భావుక చక్రవర్తి
బహుభాషలకాదాన ప్రదానము లొసగినవాడు
శివానంద సరస్వతితో "సరస్వతీపుత్ర" బిరుదునందినవాడు
"మహాకవి" అని జనులచే గౌరవింపబడినవాడు
"పద్మశ్రీ" పుట్టపర్తి నారాయణాచార్యులవారు.







# శివకర్ణామృతమ్



మహాకవి బిరుదభాజా

సరస్వతీపుత్ర ఇతి సమ్మానితేన

శ్రీమతా పుట్టపర్తి నారాయణాచార్యేణ

రచితమ్

# శివకర్ణామృతమ్

శేషశైల శిఖరాఽధివాసినః
కింకరాః పరమవైష్ణవా వయమ్
తత్తథాఽపి శశిఖండశేఖరే
శాంకరే మహసి లీయతే మనః ॥

పుట్టపర్తి నారాయణాచార్యః



శివకర్ణామృత కావ్య ముద్రణకు

సహృదయంతో ఆర్థిక సహాయం చేసిన

వేదమూర్తులు సద్గురు శివానందమూర్తిగారికి

ప్రణమిల్లుతూ...

పుట్టపర్తి నాగపద్మిని

**SIVANANDA MURTY**

Anandavan
BHEEMUNIPATNAM-531 163
Visakhapatnam Dt. A.P.
Ph : ~~0891-899505~~
08933 229505

శ్రీ:

డాక్టర్ నాగపద్మిని గారికి శుభాశీస్సులు. 20 ఆగస్టు తేదీగల జాబుతో, సరస్వతీపుత్రుల రచన 'శ్రీ శివకర్ణామృతం' DTP కాపీ అందినది. మీరు పంపిన ఇతర గ్రంథములు కూడ అందినవి. కృతజ్ఞుడను.

సరస్వతీపుత్రుల దర్శన మొకమారు పూర్వము చేసియుంటిని. మహాతపస్వులైన వారి ప్రతిమాటా, పాటా లోకమునకు గొప్ప విజ్ఞానదాయకములు. ఈ శివకర్ణామృత శతాధిక శ్లోకరచన ప్రసన్న మధురమై, భక్తిభావోద్దీపకమై ఉండుట ఆశ్చర్యము లేదు. ఆచార్య లక్ష్మణమూర్తి గారి తేటతెలుగు మాటలతో చదువరులకు సుప్రసన్నమై భాసించుచున్నది. మీరు చేయు ఈ గ్రంథముద్రణ సాహిత్యాభిరుచిని సమాజమునందు వృద్ధిచేయగలదు.

శివానందమూర్తి

భీమునిపట్నం
7-9-2006

ఆచార్య రవ్వా శ్రీహరి
పూర్వ ఉపాధ్యక్షులు
ద్రావిడ విశ్వవిద్యాలయం

సరస్వతీపుత్ర బిరుదాంచితులు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు బహుముఖీన మహా విద్వత్తేజస్వులు. చతుర్దశ భాషా కోవిదులు. సంగీత సాహిత్యాలలో దిట్టలు. గొప్ప విమర్శకులు. మంచి వక్తలు. శతాధిక గ్రంథ నిర్మాతలు. తమ 'శివతాండవ' గానంతో శ్రోతృజనాన్ని మంత్రముగ్ధం చేసిన మహానుభావులు. భక్తిమంతమైన వారి లేఖిని నుండి వెలువడిన అద్భుత స్తోత్రకావ్యమే ఈ శివకర్ణామృతం.

శివకర్ణామృత కావ్యకర్తలు పుట్టపర్తి నారాయణాచార్యులు గారు జన్మతః శ్రీవైష్ణవులు. అష్టాక్షరీ జపపరాయణ మానసులు. "సన్నుతి చెల్లెదరు మానసంబున నమో నారాయణాయేతి వర్ణతతిన్ ద్రిప్పుదు భక్తుల పాదరజముల్ నా శీర్షమందుంచెదను, తలంతున్ భవసాగరమ్మున్" అని చెప్పుకున్న నారాయణాచార్యుల వారి విష్ణుభక్తి ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. విష్ణువు పట్ల వారికి ఎంతటి భక్తి, ప్రపత్తి ఉన్నాయో శివుని పట్ల కూడా అంతటి భక్తి ప్రపత్తులున్నాయి. శివకేశవుల నిద్దరినీ అభిన్నంగా భావించిన కవివర్యులు ఆచార్యులు గారు. కనుకనే వారు పరమవైష్ణవులైనా శివపారమ్యాన్ని వర్ణిస్తూ శివభక్తి పారవశ్యంతో 'శివకర్ణామృత' కావ్యాన్ని రచించినారు.

ఈ విషయాన్నే ఆచార్యుల వారు ఈ శ్లోకాల్లో తెలుపుతున్నారు.

శ్రీశైల శిఖరాధివాసినః
కింకరాః పరమవైష్ణవా వయమ్.
తత్రథాపి శశిఖండ శేఖరే
[illegible] మహతీ రతిర్మమ (49)

అష్టాక్షరీ జపపరాయణ మానసేన
శ్రీనాగమాకలన పుంభిత సంభ్రమేణ
నారాయణేన రచితం నవ చంద్ర భూష
కర్ణామృతం జయతు కామగవీసదృక్షమ్ (50)

ఆచార్యుల వారి ఈ శ్లోకాలు, శైవుడైనా శ్రీకృష్ణుని యందు తనకున్న భక్తి పారవశ్యంతో శ్రీకృష్ణకర్ణామృతాన్ని రచించిన లీలాశుకుని ఉదంతాన్ని స్మరింపజేస్తాయి.

శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జపపరా నితరాం తథాపి
చేతో మదీయమతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్ ॥

శ్రీ రంగాచార్యులు గారు చెప్పకున్నట్లైతే ఈ శివకర్ణామృతం నిరంతరంగా కాలగర్భంలో ఏమైపోయేదో!

చివరగా ఒక మాట. ఎప్పుడో - దాదాపు యాభై ఏళ్ళ క్రిందట - పుట్టపర్తి వారు స్వహస్తాలతో వ్రాసుకున్న వ్రాతప్రతి సాఫుప్రతి వారి నిన్న ఒకరి ద్వారా నా చేతికి వచ్చింది. సాఫుప్రతి వ్రాసినట్లు గుర్తు. లేదా ఈ ప్రతులెక్కడున్నాయో నాకు తెలియలేదు. మిత్రులు డా॥ శ్రీరంగాచార్యులు గారు "శ్రీమాన్ పుట్టపర్తి వారు వ్రాసి యుంచుకున్న కాగితాల బండి ఉద్ధరించి వ్రాసినాను. దానిని పుట్టపర్తి వారు చూచిరి. వారికి ఒక ప్రతిని వ్రాసి ఇచ్చినాను. చిన్న వివరణలతో ముద్రించవలెనని అన్నారు" అని పేర్కొన్నారు. ఏమైనా సాఫుప్రతిని వ్రాయుచున్నది నేనే శ్రీరంగాచార్యుల వారిని కోరినానేమో! ఏదైనా డా॥ శ్రీరంగాచార్యులు గారు సాఫుప్రతిని ఇంతకాలం భద్రంగా ఉంచి సాహితీలోకానికి ఎంతో ఉపకారం చేసినారు.

పుట్టపర్తి వారి పుత్రిక డా॥ శ్రీమతి నాగపద్మిని గారు ఎంతో శ్రద్ధతో తండ్రిగారి కోరిక ప్రకారం ఈ గ్రంథాన్ని ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తి గారి వివరణంతో ముద్రించి పితృఋణం తీర్చుకున్నందుకు వారిని అభినందిస్తున్నాను.

శివకర్ణామృతం కావ్యం నారాయణ వినిర్మితమ్
వావర్ధతాం శైవతత్త్వ ప్రతిపాదకమాజగత్ ।

రవ్వా శ్రీహరి.

# ఏమానందము...

ఈ క్షణాలు ఉత్సాహ, ఉత్కంఠ భరితంగా ఉన్నాయి. రచనా కాలం తరువాత దాదాపు యాభై సంవత్సరాలగు ముద్రణ భాగ్యానికి నోచుకుంటున్న 'శివకర్ణామృతమ్', చతుర్దశ భాషా గహన వీధీవిహారి పద్మశ్రీ డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి సంస్కృత రచన. వారు అభిలషించినట్లు - భావార్థంతోడే వెలువడుతుండటం - నా ఉత్సాహానికి ఉద్వేగానికి కారణం.

శివకర్ణామృతమ్ వ్రాతప్రతి దొరకక మా అయ్యగారు పుట్టపర్తివారు చాలా ఆవేదన చెందటం నాకు తెలుసును. గజ్జల మల్లారెడ్డి గారన్నట్టు పట్టువిద్య ఎరుగని, పైరవీలు తెలియని కవితా విద్యమాత్రమే తెలిసిన ఆ సాహిత్యరవి ఎప్పుడూ వాపోతూనే వుండేవారు, 'నా రచన ఏనాడూ వ్రాసిన వెంటనే ముద్రింపబడలేదు'అని! 'శ్రీనివాస ప్రబంధమూ' 'పండరీభాగవతము' 'జనప్రియ రామాయణం' వంటి రచనలన్నీ వ్రాతప్రతి రూపంలో వుండగానే ప్రసిద్ధలై తరువాత ఎంతకాలానికో ప్రచురింపబడ్డాయి. కానీ శివకర్ణామృతమ్ వ్రాతప్రతే అసలు వారికి లభ్యంకాలేదు.

వారు కీర్తికాయులైన తరువాత 2000-2001 ప్రాంతాల్లో ఆ వ్రాతప్రతి పాలెం-సంస్కృత కళాశాల అప్పటి ప్రిన్సిపాల్ శ్రీమాన్ శ్రీరంగాచార్యుల వారి ద్వారా లభ్యంకావటం కేవలం నా అదృష్టమే! ఆ ప్రతిని అలకిని అందుకున్న వెంటనే దానిని ముద్రించాలన్న నా ఉత్సాహానికి అడ్డుకట్ట వేశాయి, చివరి వాక్యాలు : "శ్రీమాన్ పుట్టపర్తివారు వ్రాసియుంచుకున్న కాగితాల నుండి ఉద్ధరించి వ్రాసిన దీనిని పుట్టపర్తివారు చూచిరి. వారికి ఒక ప్రతిని వ్రాసి యిచ్చినాను. దీనిని వివరణతో ముద్రించవలెనని అన్నారు. - శ్రీరంగాచార్య 14.5.1964. మా అయ్యగారి అభీష్టం మేరకు వివరణతో సహా ముద్రించవలెనన్న నా తాపత్రయం యీ నాటికి-కార్యరూపం దాల్చటానికి కారణం నా వరంగల్ ఆకాశవాణి కేంద్రానికి బదిలీ.

2003లో బదిలీమీద అక్కడికి వెళ్ళినపుడు అక్కడ సాహిత్య కార్యక్రమాలకు సాహితీ దిగ్గంతులు ఆచార్యపేర్వారం జగన్నాధంగారు, ఆచార్య కోవెల సుప్రసన్నాచర్యాగారు, ఆచార్య మాదిరాజురంగారావు గారు ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తిగారు, ఆచార్య అనుమాండ్ల భూమయ్యగారు, ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు, డాక్టర్ అంపశయ్య నవీన్ గారు, డాక్టర్ శ్రీరంగస్వామిగారు, శ్రీగిరిజామనోహర్‌బాబుగారు, శ్రీనాగిళ్ళరామశాస్త్రిగారు,

డాక్టర్ వఝ్ఝల రంగాచార్యగారు, ఆచార్య హరిసనత్‌కుమార్‌గారు, శ్రీపొట్లపల్లి శ్రీనివాసరావుగారు శ్రీదర్భశయనం, శ్రీనివాసాచార్యగారు వీరంతా తరచూ విచ్చేసేవారు.

సాహిత్య వాతావరణంతో సదా పరిమళభరితంగా వుండేదా కేంద్రం ఎప్పుడూ. ముఖ్యంగా ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తిగారు మా అయ్యగారి అసమాన సాహితీ ప్రకర్ష, అనితర సాధ్య సాహిత్యసృష్టి ఋషితుల్య సాహితీ తపోనిష్ఠ గురించి అనర్గళంగా ఆర్ద్రంగా మాట్లాడుతుంటే నా కళ్ళు చెమర్చేవి. 1963-64 ప్రాంతాలలో న్యూసైన్స్ కళాశాలలోని ఆంగ్లవిభాగంలో పనిచేస్తున్న సమయంలో పుట్టపర్తివారిని తమ సోదరులు శ్రీరంగాచార్యులు, ఆచార్య రవ్వా శ్రీహరిగారలతో తరచూ కలవటం, సాహిత్యచర్చల్లో పాల్గొనటం, వారి సాహిత్యాన్ని ఆరాధనా భావంతో పఠించటం - యివన్నీ వారి మాటల్లోనే వింటుంటే నాకక్కడ మరో పుట్టిల్లు లభించినంత సంబరం కలిగేది. సంస్కృతాంధ్రాంగ్లాలో అద్వితీయ ప్రతిభా సంపన్నులు మనస్వి. శ్రీమాన్ శ్రీలక్ష్మణమూర్తిగారి ముందు ఓసారి నా అభ్యర్థననుంచాను- 'అయ్యగారి 'శివకర్ణామృత' సంస్కృత రచనకు భావార్థం వ్రాస్తారా!' అని! వారు వెంటనే అంగీకరించారు. వ్రాతప్రతి లభించిన వైనం విని 'శ్రీరంగాచార్యులు మా తమ్ముడే గద!" అన్నారు. అంతేకాదు. అప్పట్లో శ్రీహరిగారూ, శ్రీరంగాచార్యులుగారూ కలిసి శివకర్ణామృతమ్ శుద్ధప్రతిని తయారుచేశారనీ గూడా చెప్పారు. శ్రీరంగాచార్యుల వారి వద్ద లభించిన వ్రాతప్రతిని మళ్ళీ శ్రీగిరిజా మనోహరబాబు తమ ముత్యాలకోవ వంటి వ్రాతలో తీర్చిదిద్దగా శ్రీలక్ష్మణమూర్తిగారు సులభ సుందరభావార్థాన్ని మూలం వలనే కోమలకాంత పదావళీ విలసితంగా, నిసర్గరమణీయంగా, మనోజ్ఞంగా కూర్చారు. డిటిపిలో తప్పొప్పులనూ ఓపికగా వారే సవరించారు. అంతేకాదు ఈ కావ్యానికి అనుబంధంగా ప్రచురించిన అయ్యగారి విశ్వవిఖ్యాత రచన "శివతాండవమ్" లోని శ్లోకాలకు కూడా భావార్థాన్ని సమకూర్చారు. "శివకర్ణామృతమ్" చివరి శుద్ధప్రతిని ఆచార్య రవ్వా శ్రీహరిగారు సహృదయంలో సరిదిద్ది ఈ మహత్కార్యంలో సహకరించారు. శివకర్ణామృత కావ్యాన్ని విద్వత్కర్ణామృతంగా అభివర్ణిస్తూ ముందుమాట కూడా వ్రాశారు.

మొత్తానికి నలభైఐదు సంవత్సరాల క్రితం పుట్టపర్తివారి కలం నుండి అక్షరరూపం దాల్చిన 'శివకర్ణామృతమ్' ఈ నాటికి సాహితీ సరస్వతి అపురూప కంఠమాలగా అలంకరింపబడుతున్నది. ఈ సందర్భంగా ఈ మిత్రత్రయానికి నేను సదా ఋణగ్రస్తురాలిని!

భారతీయ సంస్కృతీ ప్రాచీన పునరుద్ధరణలో అవిశ్రాంతంగా కృషి చేస్తూ, గురు సంప్రదాయ వైశిష్ట్యాన్ని విశ్వహృదయంపై ప్రతిష్ఠింపజేస్తున్న సద్గురు శ్రీశివానందమూర్తి గారు, యీ గ్రంథ ముద్రణకై ఆర్థిక సహాయం చేయటమేకాక ఆశీస్సులనూ అందించారు. వారికి నా వినయాంజలులు.

ఇక కడప జిల్లా ప్రొద్దుటూరు నడిబొడ్డున పుట్టపర్తివారి కాంస్య విగ్రహం ప్రతిష్ఠించబోతున్న వార్త వెనుక పుట్టపర్తిసాహితీపీఠం కార్యదర్శి జింకా సుబ్రహ్మణ్యం

అంకురిత దీక్ష, తపస్సూ, అక్కడి జనవాహిని ఆత్మీయతా బంధం ఎంతో పటిష్టంగా, ప్రత్యక్షంగా సమీక్షంగానూ వుండటం కారణం. ఒక మహా కవి కీర్తికాయులైన ఒక్క సంవత్సరానికే (1991లో) వారి విగ్రహస్థాపనను జరిపి, వారిని గుండెల్లో నిల్పుకోవడం- తెలుగు నేల మీద ఒక్క పుట్టపర్తికే చెల్లింది. గత సెప్టెంబర్‌మాసంలో కొన్ని రాజకీయశక్తులు 15 సంవత్సరాల క్రితం స్థాపించిన ఆ విగ్రహాన్ని తొలగించినప్పుడు అక్కడి ప్రజానీకం ధర్నాల్లోనూ నిరసనల ప్రదర్శనల్లోనూ పాల్గొనటం చూసి, మా అయ్యగారి పట్ల అక్కడి ప్రజల అభిమానానికి మనసు ద్రవించి పోయింది. అన్ని రాజకీయ పార్టీలూ, కొందరూ అధికారపార్టీ నాయకులూ, ప్రముఖ సాహితీవేత్తలూ సైతం విగ్రహం తొలగింపు పట్ల అసంతృప్తి వ్యక్తం చేయటం వెనుక శతాధికగ్రంథకర్తగా, నిర్విరామ సాహితీ జిజ్ఞాసువుగా, నిష్కళంక సాహిత్య సేవకునిగా, శేముషీ వైభవ సంపన్నులుగా అయ్యగారికున్న గుర్తింపు తెలిసివచ్చింది.

రెండోసారి, కాంస్యవిగ్రస్థాపన జరుగబోతుండటం - మరోమారు పుట్టపర్తి ఇలపై ఆవతరించినట్లే!

'రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా' ప్రసన్నమైన జలం సజ్జనుని మనస్సులా రమణీయమన్నారు వాల్మీకి. యీ గ్రంథముద్రణలో ఇలాంటి ఎంతో మంది సజ్జనుల సహకారం లభించడం మా అయ్యగారు - పుట్టపర్తి వారి సాహితీ మూర్తిమత్వానికి నిలువుటద్దం.

ప్రముఖుల నుంచి మా అయ్యగారు అందుకున్న లేఖలు, వ్రాసిన లేఖ, వివిధ సభల్లో వారు పాల్గొన్న ఛాయా చిత్రాలు చివరి పేజీల్లో పొందుపరచటం జరిగింది.

గ్రంథ ముద్రణలో ఎప్పటిలాగే సహకరించిన అంకుశ్‌గ్రాఫిక్స్, చి.సౌ. క్రాంతికీ, ఆకృతి ప్రింటర్స్ కిరణకూ కృతజ్ఞతులు

'శివకర్ణామృతమ్' లో పుట్టపర్తివారి పరిణత ప్రజ్ఞ, మధుమయ పణితి, మరందధారా శోభితమైన కవిత్వ మధుపానానికి - సాహితీపిపాసువులకు స్వాగతం !

వినమ్రంగా

పుట్టపర్తి నాగపద్మిని

# శివకర్ణామృతమ్

'సరస్వతీపుత్ర'

పుట్టపర్తి నారాయణాచార్య

సరళ భావార్థం

ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తి



# శివకర్ణామృతమ్



1. కళానిధికలావతీకలితజూటవాటీలస
త్రివిష్టపతరంగిణీ లలితతాండవాడంబరః
మదాంచితవిలోచనో మధురముగ్ధవేషస్సదా
పరిస్ఫురతు మానసే గిరిసుతాఽనురాగాంకురః

చంద్రవంకతో విరాజిల్లే జటా జూటంలో నడయాడు గంగానదీ మృదుల తాండవంతో శోభిస్తూ, మదాలసమైన కన్నులతో, అందంగా ఆకట్టుకునే వేషంతో పార్వతీ ప్రేమాంకుర రూపుడైన శివుడు మానసమునందు ప్రకాశించుగాక!

2. విభూతిపరిశోభితం ప్రచురభూతి సంశోభితం
కరాంచిత కపాలినం గగనసంగ్రసమ్యాలినమ్
నరాస్థిచయమాలినం సకలలోకసంపాలినం
దధీమహి హృది ప్రియం, మదనగర్వసర్వంకషమ్

విభూతితో అలరారుతూ, విస్తారమైన సంపదతో ఒప్పారుతూ, చేతిలో కపాలాన్ని ధరించి, ఆకాశమంత ఎత్తుగా వ్యాపించి, అస్థికలను మాలగా వేసికొని, సకల లోకాలని పాలిస్తూ, మన్మథుని గర్వాన్ని నిశ్శేషంగా రూపుమాపిన ప్రీతి పాత్రుడైన శివుణ్ణి, మనస్సులో నిలుపుకుందాం

# శివకర్ణామృతమ్



1. కళానిధికలావతీకలితజూటవాటీలస
త్రివిష్టపతరంగిణీ లలితతాండవాడంబరః
మదాంచితవిలోచనో మధురముగ్ధవేషస్సదా
పరిస్ఫురతు మానసే గిరిసుతాఽనురాగాంకురః

చంద్రవంకతో విరాజిల్లే జటా జూటంలో నడయాడు గంగానదీ మృదుల తాండవంతో శోభిస్తూ, మదాలసమైన కన్నులతో, అందంగా ఆకట్టుకునే వేషంతో పార్వతీ ప్రేమాంకుర రూపుడైన శివుడు మానసమునందు ప్రకాశించుగాక!

2. విభూతిపరిశోభితం ప్రచురభూతి సంశోభితం
కరాంచిత కపాలినం గగనసంగ్రసచ్చూలినమ్
నరాస్థిచయమాలినం సకలలోకసంపాలినం
దధీమహి హృది ప్రియం, మదనగర్వసర్వంకషమ్

విభూతితో అలరారుతూ, విస్తారమైన సంపదతో ఒప్పారుతూ, చేతిలో కపాలాన్ని ధరించి, ఆకాశమంత ఎత్తుగా వ్యాపించి, అస్థికలను మాలగా వేసికొని, అన్ని లోకాలని పాలిస్తూ, మన్మథుని గర్వాన్ని నిశ్శేషంగా రూపుమాపిన ప్రీతి పాత్రుడైన శివుణ్ణి మనస్సులో నిలుపుకుందాం

3. దయారసతరంగితం కమపి గౌరదేహం వహన్
తుషారగిరిమస్తకే విలసితస్సుపర్వాదిభిః
కఠోరవృజినాటవీ పటలభస్మసాత్కర్మతః
చకాస్తు నిటలాంబకస్సతతమార్ద్రతంద్రే హృది

దయారసంనిండారే తెల్లని దేహంతో హిమగిరి తటంపై దేవతలతో కొలువు దీరిన, కఠోరమైన పాపాటవిని దహించి బూడిదగా చేసిన, నిటలాక్షుడు ప్రేమార్ద్రమైన హృదయంతో ప్రకాశించుగాక!

4. పరావర పరంపరా పరిణతాత్మవాదాదిభి
స్సనాతన ఉదంచితస్సతతరాగభావార్ద్రితః
సదాఽవతు తదర్చకద్రుహిణముఖ్య దేవావళీ
శిరస్తలసముల్లసల్లలిత పాదపద్మో హరః ॥

పరమూ, అవరమూ అనే పదాలతో నిబిడమైన ఆత్మవాదాలకు అందని వాడు, సనాతనుడు, ప్రేమపూర్ణమైన ఆర్ద్రమనస్కుడు, ఆనంద పరవశులైన బ్రహ్మాదిదేవతల శిరస్సులపై తన పాదపద్మాలను అనుగ్రహించిన శివుడు ఎల్లకాలము రక్షించుగాక!

5. మరాళమదమర్దనప్రథితయాన విద్యాధరీ
కరాంచితకలక్వణత్కనక కంకణాడంబరమ్।
చిరం సముపసేవితస్సితఘనోపమైశ్చామరై
ర్వరో వసతు మే లుఠజ్జలనిబద్ధయోర్నేత్రయోః॥

అందమైన నడకలతో హంసలగర్వాన్ని హరించే విద్యాధర కాంతలు అవ్యక్త మధురమైన తమ కంకణధ్వనితో తెల్లని చామరములను వీస్తూ సేవించే శివుడు, ఆనందాశ్రువులతో నిండిన కన్నులముందు కన్పించుగాక!

6. తుషారగిరికన్యకావిపులలోచనాఽఽ కేకర
స్మితాఽఽర్ద్రనవమల్లికాసుభగదృష్టి నిష్ఠీవితః।
గజాఽసురసితక్షుత ప్రథితదంతకోటిజ్వాల
త్కిణాంకపరిభూషితస్మరహరస్సమారక్షతు॥

చిరునవ్వులు చిందిస్తున్న పార్వతీదేవి విపులనేత్రాల్లో వెలుగొందే చూపులే మల్లికాపుష్పాలుగా, గజాసురుని వాడియైన దంతాలరాపిడి వలన కాయగాచిన శరీరంతో శోభించే మదనాంతకుడు రక్షించుగాక!

7. మునీశ్వరగణావనాయతవిలోచనప్రస్రవ
త్కృపాసలిలకర్దమత్తుహినపర్వతోపత్యకమ్,
పృదాకువిభుకంకణం చికురపర్యటత్కంకణం
స్మరామి విధుశేఖరం విబుధశేఖరం శూలినమ్॥

మునీశ్వరులను రక్షించే విశాలనేత్రాల నుండి జాలువారు కృపాజలంతో హిమవత్పర్వతసానువులు తడిసిపోయినాయి. మహాసర్పాలను కంకణాలుగా ధరించినాడు. జటాజూటంలో నీరు నిండారింది. చంద్రరేఖను శిరోభూషణంగా చేసుకున్నాడు. శూలాన్ని ధరించిన ఆ మహాదేవుణ్ణి స్మరిస్తున్నాను.

8. స్మితసుమనసగుచ్ఛో, రక్తజూటీకిసాక్తః
సురసముదయబాష్పైస్సంతతం సిక్తపాదః
భుజయుగదృఢశాఖః పుణ్యమాత్రేణ లభ్యో
వితరతు మదభీష్టం శాంభవః కల్పవృక్షః॥

ఆయన చిరునవ్వు పూగుత్తివలె ఉన్నది. ఎఱ్ఱని జటాజూటం చివురుటాకులా ఉన్నది. దేవతల ఆనంద బాష్పాలతో నిరంతరం ఆయన పాదాలు తడిసిపోతున్నాయి. ఆయన భుజాలు బలమైన శాఖల్లా ఉన్నాయి. ఆయన నిజంగా శంభుని రూపంలో ఉన్న కల్పవృక్షం. అది కేవలం పుణ్యంతో లభ్యమౌతుంది. ఆ కల్పవృక్షం నా కోరికలను అనుగ్రహించుగాక!

9. అర్ధజాని రవతాచ్ఛిపివిష్టో
నేతినేతి వచసా ప్రతిపాద్యః
అంతరేణ కరుణాం న నివృత్తి
ర్యస్య జన్మ శబలస్య నృజంతోః॥

ఆయన అర్ధ శరీరంలో భార్యను ధరించినవాడు. కేవలం 'నేతి' 'నేతి' పదాలతో ప్రతిపాదింప యోగ్యుడు. ఆయన దయలేనిదే అనేక జన్మవ్యాకులుడైన మానవునికి మోక్షం లభించదు.

10. న శ్రుత్యా న బహుధా తపసా నార్చనేన న జపేన దమేన।
భావభక్తిరసికశ్శశి చూడస్సర్వదా మమ పురఃప్రసర్పతు॥

వేదంకానీ, తపస్సుకానీ, అర్చనకానీ, జపంకానీ, దమంకానీ, ఆయనను ప్రసన్నం చేసికోలేవు. కేవలం భక్తి భావంచేతనే ఆయన వశుడౌతాడు. చంద్రుణ్ణి జటాజూటంలో ధరించిన ఆ శివుడు ఎల్లప్పుడూ నాముందు కన్పించుగాక!

11. గురవే నమోఽస్తు మురవైరిమస్తక
ప్రలసన్మణీగణవిరాజితాంఘ్రయే।
నవసాంధ్య వర్ణ గజకృత్తివాససే
భువనావనాయ దృఢచిత్తమూర్తయే॥

ఆయన పాదపద్మాలు విష్ణుశిరస్తలంపై వెలిగే మణులతో విరాజిల్లుతున్నాయి. సంధ్యారుణకాంతితో తొణికిసలాడే గజచర్మాన్ని ధరించినాడు. చతుర్దశ భువనాలను రక్షించడానికి దృఢసంకల్పం చేసినవాడు. ఆ మహితాత్ముడైన శివునకు నమస్కారము.

12. గురవే నమోఽస్తు నిటలాక్షబంభ్రమ
ల్లయవహ్నిలీఢగగనాయ భాస్వతే।
ఘనతాండవాఽభిముఖవక్త్రనిర్గమ
ద్విపులాఽట్టహాసమహతే స్వయంభువే॥

ఆయన ఫాలనేత్రం నుండి అగ్ని అన్నిదిశల్లో క్రమ్ముకొని ఆకాశాన్ని బెంబేలెత్తిస్తున్నది. ఆయన తేజస్సుతో వెలిగిపోతున్నాడు. గొప్పతాండవ ప్రదర్శనకు ముందుగా వెలువడిన ఆయన విపులమైన వికటాట్టహాసం ఆయన మహత్త్వాన్ని చాటుతున్నది. స్వయంభువుడై మహితాత్ముడైన ఆశివునకు నమస్కారము.

13. గురవే నమోఽస్తు గిరిజారసాక్తదృ
క్పరిపీత దివ్యతనవే గజద్విషే।
రటదంసకూటవినిబద్ధకర్ప రాఽ
స్థిచయాఽభిరామ మహసే ధుతాంహసే॥

రసనిర్భరమైన కన్నులతో పార్వతి ఆయన దివ్య సౌందర్యాన్ని తనివిదీరా చూస్తున్నది. ఆయన గజాసురుని సంహరించిన యోధుడు. బలిష్ఠమైన భుజాంతరంలో ధరించిన కపాలమాలతో ఒప్పారుతున్నాడు. ఆయన పాపాలన్నింటినీ హరిస్తాడు. ఆ మహితాత్ముడైన శివునకు నమస్కారము.

14. గురవే నమోఽస్తు పరతత్త్వరూపిణే
గురవే నమోఽస్తు భవరోగహారిణే।
గురవే నమోఽస్తు భవజన్మతారిణే
గురవే నమోఽస్తు శివరూపధారిణే॥

పరతత్త్వమే ఆయన ఆకృతి. ఆయన సంసార వ్యాధిని హరిస్తాడు. అనేక జన్మరూపమైన సముద్రం నుండి గట్టెక్కిస్తాడు. మంగళరూపాన్ని ధరించి ప్రసన్నంగా ఉంటాడు. ఆ శివునికి నమస్కారము.

15. గిరిజానయనాబ్జలస
చ్చిక్కణకజ్జలవినీలరుచినిచితమ్।
మాధుర్యాదపి మధురం
మదగంధిలమీక్షణం మహేశస్య॥

పార్వతీ దేవిని తదేకదీక్షతో చూస్తూ ఉంటే ఆ దేవి కన్నుల కాటుకరంగు ఆయన చూపుకే అంటుకున్నట్లున్నది. ఆయన చూపు మాధుర్య గుణం కంటే మధురంగా మదభరితమై ఉన్నది.

16. రతిజాగరకుట్మలితం
కించిదరుణమబ్జచంద్రికావలితమ్
కరుణానిబిడితమవతా
త్కాంతతమం వీక్షణం గిరీశస్య॥

కాస్త అరుణమై, రతిజాగరంతో అలిసి అరమోడ్పై, వెన్నెలకు మూసికొన్న కలువలాగా మనోహరమై దయతోనిండారిన మహేశుని అందమైన చూడ్కి అందరినీ రక్షించుగాక!

17. లలితాలలితాధరమణి
పరిచుంబనసౌఖ్యముద్రితాన్నయనాత్।
జగతి పరం జానీమః
న పినాకేశ్చంద్రచంద్రికావలితాత్॥

పార్వతీమధురాధరాన్ని ముద్దాడిన సౌఖ్యంతో పరవశమై, వెన్నెలనిండిన మహేశుని నేత్ర సౌందర్యాన్ని మించింది మరొకటి జగత్తులో మాకు తెలియదు.

18. కపాలీ భిక్షాశీ పితృవననివాసీ పశుపతి
ర్వినాశీ పాపానాం స్మితమధురవేషీ మృగధరః
పరానందస్తోత్ర శ్రవణమృదుసంచాలితశిరాః
విధత్తామంఘ్రిం మే మనసి తపసా ధూతతమసి॥

కపాలాన్ని పట్టుకొని, భిక్షాటనంచేస్తూ, శ్మశానంలో నివసిస్తూ, పాపాలను హరిస్తూ, చిరునవ్వుతో అందంగా కనిపిస్తూ మృగచర్మాన్ని ధరించి, ఆనందంగా భక్తులు స్తుతింపగా విని శిరఃకంపం చేస్తూ ఒప్పారే పశుపతి తపస్సుతో నిర్మలమైన నామనఃప్రదేశంలో కాలిడుగాక!

19. దయాకుల్యా కల్యోన్మిషిత సితపద్మాఽనుగరుచిః
పురారాతి శ్రీమాన్భుజగపతిభూషోజ్జ్వల తనుః
మహాకాలః కాలాఽనలతులిత నేత్రోద్ధురశిఖో
విభింద్యాన్మే కామం బహుళతర జన్మైకనిగడమ్॥

దయాప్రవాహంలో ప్రాతఃకాలవేళ విప్పారిన పద్మంవలె ప్రసన్నమైనవాడు, త్రిపురాలను జయించినవాడు, సర్పభూషణాలతో మెరిసేవాడు, కాలాగ్నిని తలపించే కంటిమంట కలవాడు, మహాకాలుడు, అనేక జన్మ సముపార్జితమైన నా కామాన్ని హరించుగాక!

20. పినాకీ నాకేశాఽఽదికవిబుధమస్తార్చితపదః
పదం తత్త్వౌఘానాం పరమపద సింహాసనగతః
నతార్తానాం దుఃఖోపశ మనధురామగ్నహృదయో
దయాపుల్లః క్రోధం హరతు మమ సంవిత్ప్రశమనమ్॥

పినాకాన్ని ధరించి, ఇంద్రాది దేవతలు ఆయన పాదాలకు ప్రణమిల్లగా, అన్ని తత్త్వాలకూ గమ్యమై, పరమపదసింహాసనంపై ఆసీనుడై, భక్తుల దుఃఖాన్ని శాంతింప జేయడానికి నిత్యంసన్నద్ధుడై విరాజిల్లే శివుడు, దయాప్రపూర్ణుడై, జ్ఞానాన్ని హరించే నా క్రోధాన్ని రూపుమాపుగాక!

21. రాజరాజసఖశ్శంభూ రాజరాజిత మస్తకః
రాజీవసమనేత్రాంశో మమ లోభాయితో హరః॥

కుబేరునికి మిత్రుడై, చంద్రవంకను శిరస్తటంపై ధరించి, విప్పారిన పద్మాల వంటి కనులతో వెలుగొందే శివుని మనసారా కాంక్షిస్తున్నాను.

22. నిటలానలనయనాఽఽపీత
కామః కామవశంగతః।
మమ వాఙ్మయమాధుర్యం
దారుకావనగోచరః

తన నుదుటికంటి మంటతో మన్మథుణ్ణి కబళించిన వాడు కామవశుడైనాడు. ఆయన నా కవితా మాధుర్యస్వరూపుడు, దారుకావనంలో దర్శనమిస్తాడు.

23. ఏష చకాస్తి పురస్తాత్
దృశోర్ముహుర్ముహుర్వలితకంఠః।
నటనపరః పరమశివ
శ్శివాయితాఽర్ధాంగనిచితశృంగారః॥

నా కనుల ముందు శితికంఠుడై నటనపరుడైన పరమశివుడు మాటిమాటికి కన్పిస్తున్నాడు. ఆయన అర్ధశరీరం పార్వతిగా భాసిస్తూ శృంగారాన్ని స్ఫష్టం చేస్తున్నది.

24. నిహన్యాన్మాత్సర్యం త్రిపురదహనోద్రిక్తహృదయో
దయావీరశ్చండీచరణనమనానందకమితా।
య ఏవం ధ్యాయంతో విమలమనసః కష్టతపసో
విదుర్వేద్యాంతం తే న విదురపి శైవాగమవిదః॥

త్రిపుర దహనంతో ఆయన హృదయం ఉద్రిక్త మైంది. ఆయన దయా వీరుడు. చండీచరణముల ముందు ఆనందంతో మోకరిల్లుతాడు. ఎంతో కష్టమైన తపస్సును సమాచరించిన విశాల హృదయులు శివాగమవేత్తలు, శివుణ్ణి నిరంతరం ధ్యానిస్తూ తెలిసికొన్నారో లేదో!

25. కుంభజన్మముఖమౌనిమండలీ
మండితే నవతమాలకంధరే।
గంధవారణ మదాఽపనోదనే
శాంభవే మహసి లీయతే మనః॥

అగస్త్యుడు మొదలైన మహామునులు ఆయన్ను పరివేష్టించి ఉంటారు. ఆయన మెడ తమాల పత్త్రంలాగా వినీలంగా ఉన్నది. ఆయన గజాసురుని మదాన్ని హరించిన మేటి. అట్టి శంభుని తేజస్సునందు నా మనస్సు లీనమౌతున్నది.

26. విపులదృశం విస్మృతకచం
మధురాఽధరమందహాసమాధుర్యమ్।
గిరిజాలోచనకజ్జల
రమణీయం జయతి శాంకరం తేజః॥

విశాలమైన కన్నులతో అటునిటూ నడయాడే జటాసముదాయంతో అధరంపై మందహాసమాధుర్యంతో పార్వతి కనులకాటుకతో రమణీయమైన శంకరుని తేజస్సు జయిస్తుంది.

27. పార్వతీపదనిక్షిప్తలాక్షారసనిషేవితామ్।
నుమస్తామైందవీం రేఖాం రతలీలారహస్సఖీమ్॥

శంకరుని శిరస్సుపై వెలుగొందే చంద్రరేఖకు పార్వతీ పదాల లత్తుక అంటుకున్నది. ఆదిదంపతుల రహఃక్రీడాసఖియైన ఆ చంద్రరేఖను కీర్తించుదాం.

28. కమలకరం త్రిమలహరం
త్రిదశహరం మనసి శమితరుదితభరమ్।
మదనాంతకమనుదివసం
ధ్యాయేమహి యోగిజీవనాధారమ్॥

సూర్యనేత్రుడై కమలాలను వికసింపచేసేవాడు, శరీరవాఙ్మనో మాలిన్యాన్ని హరించేవాడు, దేవతలను శాసించేవాడూ, మనస్సులో నున్న దుఃఖభారాన్ని శమింపచేసే వాడూ, మన్మథుణ్ణి హరించినవాడు, యోగి జీవనాధారమైనవాడు- ఆ పరమశివుడు. ఆయనను నిత్యమూ ధ్యానించుదాం.

29. సంవిన్మయే విలీయే
చంద్రామృతమధురితాఽలికాపాంగే
గౌరీప్రణయాసారే
కామాఽతిగమునిహృదబ్జకాసారే॥

ఆయన జ్ఞానమయుడు, ఆయన నిటలాక్ష దృక్కులు చంద్రామృతంతో మధురంగా సిద్ధమైనాయి. ఆయన గౌరీకాంతను ప్రణయవర్షంతో ప్రసన్నం చేస్తాడు. కామాన్ని జయించిన మునులు, ఆయన హృదయ సరస్సులో కమలములలాగా ఉంటారు. ఆ శివుని యందు నేను లీనమౌతాను.

30. లక్ష్మీం తనోతు శశిభూషణపాదయుగ్మం
పౌరందరీ విమలరల్లకమల్లికాఢ్యమ్।
ఆరక్తనేత్రశబరీమృదుగానవాహి
న్యాప్లావితం నిగమవాదసుగంధిలం నః॥

దేవతాస్త్రీల విమలవస్త్రములు మల్లికాపుష్పములవలె ఆచ్ఛాదింపగా, కాస్త ఎఱుపెక్కిన కనులతో శబరకాంతలు మధురంగా గానంచేస్తూ, ఆ గానప్రవాహంతో ప్రక్షాళింపగా వెలుగొందు చంద్రశేఖరుని పాదయుగ్మం సంపదను అనుగ్రహించుగాక!

31. యశ్శాస్త్రయోనిరపి భక్తిపథైకగమ్యో
రాత్రించరోఽపి జనుషాం తమసాం నిహంతా
భిక్షాచరోఽపి భృశదానపరాయణో ఽ సౌ
భూయాదనంతమహిమా జగతాం సుఖాయ॥

సకల శాస్త్రాలకు ఉత్పత్తి స్థానీయుడైనా ఆయనను భక్తి మార్గాన్ని అనుసరించే చేరగలము. వల్లకాటిలో రాత్రులందు చరించేవాడైనా ఆయన అనేకజన్మల తమస్సును హరిస్తాడు. భిక్షాటనం చేసేవాడైనా, ఆయన మహాదాత. అనంత మహిమాన్వితుడైన ఆ మహాదేవుడు జగత్తులకు సుఖమును కలిగించుగాక!

32. గోప్త్రీ దేవవ్రజానాం వినమితమనసాం సంప్రదాత్రీ సుఖానాం
హర్త్రీ దుఃఖాదిహేతోశ్శివ ఇతి వచసా గీయమానా మహద్భిః।
సంభిన్నేభేంద్రదంతద్యుతిముషి వపుషి ష్ఠీయమానా త్రినేత్రా
ద్వంద్వజ్ఞానాత్పరస్తాద్విచరతి మహితా శాంభవీ బ్రహ్మవిద్యా॥

దేవతలనందరినీ కాపాడేదీ, భక్తులకు సుఖాలనుకలిగించేదీ, దుఃఖాదులకు కారణభూతమైన వానినన్నింటినీ హరించేదీ, మహాత్ములచే శివనామంతో కీర్తింపబడేదీ, పగిలిన ఏనుగుదంతం వలె తెల్లనైన శరీరకాంతి కలిగినదీ, మూడు కన్నులతో విరాజిల్లేదీ సుఖదుఃఖాదులకు అతీతమైనదీ ఐన శాంభవ బ్రహ్మవిద్య లోకంలో గొప్పగా రాణిస్తుంది.

33. పార్వతీస్తనతారుణ్య పరీపాకఫలం స్తుమః।
వక్షోదేశం మహేశస్య గజాసురకిణాంకితమ్॥

గజాసురమర్దనంలో మహేశుని వక్షస్థలం కాయలు గాచింది. ఆ విశాల వక్షస్థలం పార్వతీస్తనపటుతా పారమ్యానికి లభించిన ఫలం వలెనున్నది. దానిని కీర్తించుదాము.

34. మదభరకుచైకపార్శ్వం
మదనమదాటోపవర్ధి మధురముఖమ్।
ధనదసఖం కలితసుఖం
విలోకయే మనసి విభ్రమాధారమ్॥

అర్ధభాగం స్త్రీరూపమై, మన్మథమదాన్ని ప్రేరేపించే అందమైన ముఖంతో ప్రకాశిస్తూ, మనస్సుకి విభ్రమం కలిగించే, సుఖకరమైన కుబేరమిత్రమైన రూపాన్ని చూస్తున్నాను.

35. మనోనిర్వాణమస్మాకమేకమేవావభాసతే।
కైలాసపర్వతాగారే నటలీలాపరం మహః॥

మా మనస్సులకు ఆనందం కలిగించే కాంతి ఒక్కటే - అది కైలాస పర్వత గుహలో నాట్యంలో లీనమై ఉన్నది.

36. ఆధారాంబుజవిహరణశీలో
బాధాఽఽకరభవ విదళనకేలిః।
బోధాఽద్భుత సరసీరుహమాలీ
కృపణహృదం మామవతు త్రిశూలీ॥

ఆ త్రిశూలి ఆధారకమలంలో విహరిస్తూ, బాధాకరమైన సంసారాన్ని దహిస్తూ, అద్భుత జ్ఞానపుష్పమాలను ధరిస్తూ పిరికిగుండె వాణ్ణైన నన్ను కాపాడుగాక!

37. మునిమానస గగనాంతరహంసః
జ్ఞానామృతసరసీకలహంసః।
గిరితనయానళినీసితభృంగః
చిరమధివసతు దృశోర్మధురాంగః॥

ఆయన మునిమానసాకాశంలో విహరించే హంస. జ్ఞానామృత సరస్సులో ఈదులాడే హంస. పార్వతీరూపకమలాన్ని ఆశ్రయించిన తెల్లని తుమ్మెద. అంతటి మనోహరరూపం కలిగిన శివుడు నా కనులముందు చిరకాలం నిలుచుగాత!

38. మదనాభివర్ధనతనూ
మదమధురౌ కమలబంధురకరౌ చ।

పుష్కరకచౌ భజేయం
సితరౌ లోకైకరక్షణా౽౽కారౌ॥

వారి శరీరసౌందర్యం మన్మథుని ప్రోత్సహిస్తున్నది. వారు మదంతో అందంగా కన్పిస్తున్నారు. చేతులలో కమల పుష్పాలను ధరించినారు. ఒకరి జటాజూటం పుష్కర మేఘం వలె విస్తరింపగా మరొకరి కేశసంపద పుష్కళంగా ఉన్నది. లోకరక్షణకై అవతరించిన ఆకారములతో విరాజిల్లే జగత్పితరులను (పార్వతీ పరమేశ్వరులను) భజిస్తాను.

39. గిరిజాప్రణయాదర్శవిలోచన
సరభసవిగలత్కరుణాపూరః।
మస్తకధృతనీరో మృదుహీరో
పమహసితో౽వతు గుణకూపారః॥

పార్వతీదేవి ప్రణయాలోకంతో హృదయంలో కరుణారసం పొంగెత్తగా శిరస్సుపై గంగను ధరించి, మృదువైన హీరంవలె నిర్మలమైన మందహాసంతో వెలుగొందే సద్గుణ సముద్రుడైన శివుడు రక్షించుగాక!

40. ధిమిధిమితకమర్దలమర్దననిన
దా౽నుగకోమల విచలిత పాదః।
ప్రతిపదవలనప్రకల్పితవేదః
ప్రతిపదమవతాన్మునిగణబోధః॥

మద్దెల ధిమి ధిమితక ధ్వనుల కనుగుణంగా కోమలంగా పాదాలను కదిలిస్తూ నృత్యం చేస్తూ, పదఘట్టనంతో వేదాలను సృజిస్తూ, మునులకు జ్ఞానోదయం కలిగించే శివుడు ప్రతిపదం తోడై రక్షించుగాక!

41. ఉల్లోకితనయనోద్ధతదృష్టిస
ముల్లసితాంబరకల్పితమేఘః।
కహకహనినదా౽౽కబళితలోకః
కాంతో౽వతు గిరిశో దళితా౽ఘః॥

పైకెత్తిన కనుల చూపులతో ఆకాశంలో మేఘాలను కల్పించి, కహకహమనే అట్టహాస ధ్వనితో లోకాలను కబళించి, పాపాలను పారద్రోలి ప్రకాశించే శివుడు రక్షించుగాక!

42. మస్తకచాలితమందానురణ
ద్గంగాకణముక్తాంచితఫాలః।
నిటలాఫలకాఽఽనృత్య దభంగా
గ్నిశిఖాకృత నీరాజనమాలః॥

శిరఃకంపంతో కదిలి, మంద ధ్వనితో ప్రవహించే గంగానది జలబిందువులు ముత్యాల వలె ఆయన ఫాలతలంలో కన్పిస్తున్నాయి. నిటలఫలకంపై అగ్నిశిఖలే నీరాజన మాలలుగా ఉన్నాయి. (ఆయన రక్షించుగాక!)

43. ధీరవారిధరమంద్రగర్జిత
స్ఫారగీతనిబిరీసదిక్తటః।
నాట్యవేగబహుధాపదత్పదః
పాతు మాం రభససంచలత్పటః

నిర్భరమేఘగర్జనంతో దిక్కులు పిక్కటిల్లినాయి. నాట్యంలో వేగంగా కదిలే పదాలు నినదిస్తున్నాయి. ఆ వేగానికి ఆయన ధరించిన గజచర్మపటం సంచలిస్తున్నది. (ఆయన రక్షించుగాక!)

44. సంధ్యాంబుదనిభగంధేభాఽఽజిన
విగళితరక్త పరిష్కృతగాత్రః।
మామవతాద్గిరిజాస్తనచూచుక
మృగమదలహరీసురభిత నేత్రః॥

సంధ్యాకాలమేఘాన్ని తలపించే గజాన్ని సంహరించి నెత్తురోడుతున్న ఆ చర్మాన్ని అందంగా ధరించినాడు. పార్వతీస్తనకస్తూరికాపరిమళంతో ఆయన కన్నులు వెలుగుతున్నాయి. ఆయన నన్ను రక్షించుగాక!

45. చింతిత ఫలసంపాదన
చింతామణిరమరనికరమస్తమణిః।
తాత్త్విక తేజస్సరణిః
పునాతు మాం కాలకంఠహీరమణిః॥

కోరికలను ఈడేర్చే చింతామణి, దేవతా సమూహానికి మణివంటివాడు. తాత్త్విక తేజస్సును ప్రసరింపజేసేవాడు. ఆ కాలకంఠుడనే హీరమణి నన్ను పవిత్రుని చేయుగాక!

46. పునంతు శ్యామాంగీవిమలతమదంతోపమకలాః
కళాధామప్రోద్యత్కిరణ నికరాఽఽసారతులితాః।
వలత్కల్పక్రోడప్రథితసితదంతవ్యతికరా
స్త్రినేత్రస్యోద్ధాసాస్సకలజగదాస్ఫోటనపరాః॥

పార్వతీదేవి దంతకాంతివలె తెల్లనైనవీ, చంద్రుని కిరణములతో పోల్చదగినవీ, ఆదివరాహదంష్ట్రా సమానమైన ధావళ్యము కలిగినవీ, సకల జగత్తులను భేదింప గలిగినవీ ఐన త్రినేత్రుని అట్టహాసాలు పావనము చేయుగాక!

47. కిమేతదవ్యయం వస్తు
శివనామ్నా ప్రదీపితమ్?।
కవిమార్గజుషాం నృణా
మతులం మధువాఙ్మయం॥

శివనామంతో వెలుగొందే శాశ్వతమైన ఆ వస్తువేదో తెలియరాదు. కవు లందరికీ అది నిరుపమా3నమైన, తేనెవలె తీయనైన వాఙ్మయము.

48. కల్యాణవిత్తనిధయే కనకాచలేంద్ర
కోదండకాండపరిఖండితరాక్షసాయ।
పంచాక్షరీపరమపావనమంత్రవర్ణ
రూపాయ! ధిక్కృతయమాయ నమో నమోఽస్తు॥

శుభకరమైనసంపదలకు ఆయన ఒక నిధి. మేరుపర్వతాన్ని ధనుస్సుగా ధరించి రాక్షసులను సంహరించినవాడు. పరమపవిత్రమైన పంచాక్షరీమంత్ర రూపుడు. యముణ్ణి ధిక్కరించినవాడు. ఆయనకు నమస్సులు.

49. శేషశైలశిఖరాధి వాసినః
కింకరాః పరమవైష్ణవా వయమ్।
తత్తథాపి శశిఖండశేఖరే
శాంకరే మహసి లీయతే మనః॥

మేము శేషాద్రిపై కొలువైన శ్రీనివాసుని దాసులము. పరమవైష్ణవులము. ఐనేనూ, చంద్రరేఖను శిరోభూషణంగా ధరించిన శంకరాకృతి కాంతియందే మనస్సు లీనమౌతున్నది.

50. నమో నారాయణాయేతి
మంత్రోఽస్మాకం హృది ప్రియః।
తథాపి నేత్రయోరగ్రే
వరీవర్తి మహానటః॥

'నమో నారాయణాయ' అనుమంత్రమే మా హృదయమునకు ప్రియమైనది. ఐననూ, మా కన్నుల ముందు మహానటుడు వెలిగిపోతున్నాడు.

51. శూలస్య భర్తా శమనస్య హర్తా
ధర్తా శ్రుతీనాం ప్రలయే విహర్తా ।
సత్యానృతే యో వివినక్తి లోకే
స్యతు భ్రమం నః పరమః పరాత్మా॥

ఆయన శూలమును భరించినవాడు. యముని హరించినవాడు. వేదములను ధరించినవాడు. ప్రళయ కాలంలో విహరించేవాడు. లోకంలో సత్యాన్నీ అనృతాన్నీ (అసత్యాన్ని) విడదీసి వివరించేవాడు. ఆ పరాత్పరుడు నా భ్రాంతిని తొలగించుగాక!

52. త్వమగ్నిస్త్వం వాయుస్త్వమసి జగదాధారవిశద
స్త్వమేవాఽఽఢ్యః సామ్నాం త్వమసి యజమానః క్రతువిధౌ।
స్మరంతస్త్వామేవ స్తిమితమతయో దివ్యమునయో
న కాంక్షంతే మోక్షం పశుప! కృపయా పాలయ పశుమ్॥

నీవు అగ్నివి. నీవు వాయువు. నీవు విశాలమైన ఆకాశానివి. నీవు సామవేద శోభితుడవు. నీవు యజ్ఞమును నిర్వహించే యజమానుడవు. నిన్ను స్మరిస్తూ ప్రశాంత మనస్కులైన దివ్య మునులు మోక్షాన్ని కూడా కాంక్షింపరు. పశుపతీ! నేను పశువును. నన్ను దయతో పాలించు.

53. న యత్ర సూర్యేన విధుర్న వహ్ని
ర్నభిన్నతా న త్రిగుణావభాసః।
చరంతమానందమయే మహిమ్ని
మృడం భజామో మృగితం మునీంద్రైః॥

సూర్యుడుకాని, చంద్రుడుకాని, అగ్నికాని ప్రవేశింపని భిన్నత్వములేని, త్రిగుణములు లేని ఆనందమయమైన మహిమోపేతమైన స్థానమునందు వెలుగొందునట్టి మునీంద్రులు అన్వేషించునట్టి మృడుణ్ణి (శివుని) భజించుదాము.

54. ఓంకార రత్నమకుటా
లంకారశ్శత్రుభయదహుంకారః।
వేదాళీర్ఝుంకారో
దదాతు మే దర్శనం చిదాకారః॥

ఓంకారం ఆయన రత్న కిరీటానికి అలంకారం. ఆయన హుంకారం శత్రు భయంకరం. వేదాలు ఆయన ఝుంకారం. ఆయనది చిదాకారం. ఆయన నాకు దర్శనమును అనుగ్రహించుగాక!

55. సంతనోతు మయి సంతతం శివః
సౌఖశాయనికవాసవాదికః।
స్వస్తి నిస్తులమనన్యశాలినీ
యేన చౌపనిషదీ సరస్వతీ॥

ఆయనకు ఇంద్రాది దేవతలు ప్రాతఃకాల శుభాభివాదం చేస్తారు. ఆయన క్షేమంకరుడు. ఆయనవలననే ఉపనిషత్సరస్వతి ప్రకాశిస్తున్నది.

56. శ్రీనిధిం ధృతదిగంబరం మహా
కాలముచ్ఛ్రితజటాపినాకినమ్।
సర్వభూతసుహృదం సనాతనం
శాంతిగంధిలముఖం సమాశ్రయే॥

ఆయన సంపదలకు నిధి. ఆకాశాన్ని అంబరంగా ధరించినవాడు. మహాకాలుడు. ఉన్నతమైన జటాజూటంతో, పినాకంతో వెలుగొందేవాడు. సర్వభూతాలకూ ఆప్తుడు, సనాతనుడు. పరమశాంతమైన ఆయన ముఖారవిందాన్ని సమాశ్రయిస్తాను.

57. దుర్దమేంద్రియ పథాఽతిగామినః
కుంభజన్మముఖపుణ్యయోనయః।
యత్పదద్వయముపేత్య తారితా
స్తుంగమంగళముమాధిపం భజే॥

ఇంద్రియజయం సాధించిన అగస్త్యాది మహామునులు ఆయన పదములను ఆరాధించి తరించినారు. పరమశుభాస్పదుడైన ఆ మహాప్రభువును భజిస్తాను.

58. అద్భుతం మహదపేతసాధ్వసం
కించిదస్తి కిల వస్తు నిస్తులమ్।
ఇత్యబోధి నిగమైర్ముహుర్ముహు
ర్యచ్చిదాత్మకముపాశ్రయామహే॥

అద్భుతమై, మహితమై, ఉత్సాహభరితమై ఒప్పారు నిస్తులమైన వస్తువేదియో వివరింపరాకున్నది. ఈ సత్యమును వేదములు గ్రహించినవి. అట్టి చిదాత్మకమైన కాంతిని ఆశ్రయించుదము.

59. విష్ణురేవ జగతాం పరం మహో
నాస్తి కశ్చిదపి సంశయో మమ।
వైష్ణవాగ్రిమపదం వినిందతాం
శంకరం శ్రుతిశతేషు కా గతిః॥

విష్ణువే జగత్తులన్నింటినీ మించిన తేజస్సు అనుటలో నాకు ఎట్టి సందేహమూలేదు. వైష్ణవాగ్రణులలో శ్రేష్ఠుడైన శంకరుని నిందించిన వారికి వేదములందు స్థానమెక్కడిది?

60. శంకరే భువనశంకరేఽపి వా
శ్రీపతౌ శ్రుతిశతాధివాసిని।
భిన్నదృష్టిమపహాయ యోగిన
స్సంతరంతి తమసాం పదం జనిమ్॥

భువనములకన్నింటికి శుభము కలిగించు శంకరుని యందు, వేదములందు కీర్తింపబడిన విష్ణువు నందు భేదభావమునుమాని యోగులు తరిస్తారు. (చీకటినిండిన పుట్టువునుండి విముక్తులౌతారు)

61. అయత్నసంకల్పిత సర్వలోక
మకృత్రిమాణాం వచసాం విభావ్యమ్।
అగోచరం బ్రహ్మముఖామరాణా
మానందకందం శరణం వ్రజామి॥

ఆయన లోకాలన్నింటినీ అప్రయత్నంగా సృష్టిస్తాడు. వేదాలు అయన్ను వర్ణిసాయి. బ్రహ్మాది దేవతలకు ఆయన అగోచరుడు. ఆనందస్థానమైన శివుని శరణువేడుతాను.

62. విపశ్చితామప్యనధీతమార్గ
మపశ్చిమం నిర్మలభక్తిభాజామ్।
కారుణ్యపూరైస్తు వికాసయంతం
విద్యాదికాన్ విశ్వగురుం నమామి॥

పండితులు ఆయనను తెలుసుకోజాలరు. నిర్మలమైన భక్తి కలవారికే ఆయన సులభుడు. ఆయన తన కరుణాపూరంతో విద్యలనన్నింటినీ వికసింపజేస్తాడు. విశ్వగురువైన అట్టి శివునకు నమస్కారము.

63. సౌందర్యపుంభావమహీంద్రహారం
కల్పాగసీధుద్రవరక్తనేత్రమ్।
విలోకతాం దైవతపుంగవానాం
మనాంసి సద్యస్తరుణీబభూవుః॥

సౌందర్యం పురుషాకృతిని ధరించినట్లు ఆయన ప్రకాశిస్తున్నాడు. మహాసర్పాలను హారాలుగా ధరించినాడు. కల్పవృక్షం నుండి లభించే ఆసవాన్ని గ్రోలి ఆయన కన్నులు కాస్త ఎఱ్ఱబడినాయి. ఆయనను విలోకించిన దేవతల మనస్సులు తరుణభావాన్ని పొందినాయి.

64. పరస్పరసమాశ్లేషరసోన్మత్తపరస్పరమ్
కిమప్యవిదితం ధామ చకాస్తి మమ నేత్రయోః॥

పరస్పరాలింగనంతో రసోన్మత్తమై వర్ణింపరాని కాంతి యేదో నా కన్నుల ముందు ప్రకాశిస్తున్నది.

65. పీతం యక్షసుతాభిరాయతతరైర్నేత్రైరభీక్ష్ణాంగజం
సద్యోభిన్నహిమాద్రికాననతటీకస్తూరికాగంధిలమ్।
వీణాగానరసాభితర్పితమనాజ్ఞీంద్రాయమాణాంబకం
నాగేంద్రాభరణం నతార్తిహరణం సౌందర్యమీడేమహి॥

యక్షకాంతలు తమ విశాలమైన నేత్రాలతో ఆ సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నారు. అది హిమాచలారణ్యంలో విశేషంగా ప్రసరించిన కస్తూరీ పరిమళంతో నిండారింది. సర్పభూషణాలతో ఇనుమడిస్తున్నది. భక్తుల బాధలను తీరుస్తున్నది. ఆ సౌందర్యాన్ని స్తుతిస్తున్నాను. (శివునికి ఆయన సౌందర్యానికి అభేదం చెప్పడం)

66. స్వామిన్ సృష్ట్యాదిమారభ్య మత్సమో నాస్తి పాతకీ!
యది మద్రక్షణే న స్యాః ఆహోస్విత్కింభవిష్యతి॥

సృష్టి ఆరంభమైన నాటినుండి నావంటి పాతకి లేడు. నీవే రక్షింపకున్నచో, ఇక నాకేమౌతుంది? (మరొక గతి లేదని అర్థము)

67. అంగేషు విభ్రమదృశామతిలోలకామాత్
నిర్లజ్జమేవ పశువద్బహుశః ప్రవృత్తమ్
సంస్మృత్య తాని హృదయం పరిదూయతే మే
స్వామిన్! దయాశరనిధే! కరుణాం విధేహి॥

విభ్రమంకలిగించే కాంతల శారీరక సౌందర్యానికి వశుణ్ణై కామాతిరేకంతో పశువువలె ప్రవర్తించినాను. ఆ విషయాన్ని తలుచుకుంటే హృదయం బాధపడి పోతుంది. దయాసముద్రుడవైన శంకరా! నన్ను దయజూడుము.

68. సంభుక్తమేవ సుఖముజ్ఝితతృప్తిచిత్తం
రోమంథయిష్యతి పునః పునరిందుచూడ!।
ఇత్థంగుణా భగవతీ భవదీయమాయా
జంతూన్ నిహంతి కుసుమాకృతిఖడ్గికేవ ॥

తృప్తి కలిగేలాగా సుఖాలను అనుభవించినా, మనస్సు వాటినే నెమరు వేస్తుంటుంది. నీ మాయాస్వభావమది. అది పుష్పాకారంలో ఉన్న ఖడ్గంలాగా జంతువులను సంహరిస్తుంది.

69. పూర్వకర్మపరిపాక మూలకం
భవ్యమస్తు శుచయే సుఖాయ వా।
శైవవైష్ణవ పథాఽతివర్తినీ
స్యాచ్ఛివే మహసి భక్తివాహినీ॥

పూర్వకర్మ ఫలానుసారంగా జరుగవలసింది మంచియో చెడో జరుగనీ, శైవ వైష్ణవ భేదానికి అతీతమైన భక్తి ప్రవాహము శివకాంతియందు నెలకొనుగాక!

70. ఐందీవరీ దృశి పదే వికచారవిందీ
చాంద్రాతపీ శిరసి కంఠతటే చ నీలీ।

నిత్యం శివాత్మకతయా ప్రవిభావ్యమానా
కాంతిః కరోతు కృపయా దురితోపశాంతిమ్॥

కనులు కలువ పూవులవలె, పదములు వికసించిన కమల పుష్పాలవలె, శిరస్సున వెన్నెలతో మెడపై నీలకాంతితో ఒప్పారి, శివాత్మకముగా భావింపబడే కాంతి దయతో పాపములను శాంతింపజేయుగాక!

71. విలీనం స్వానందే గతచలనచిత్రాయితతనుం
తుషారాద్రేర్వాతైశ్చలితచికురం కాంతినిచితమ్।
విశాలోరస్కం త్వాం సుభగతరపద్మాసనయుతం
కదా సంపశ్యేయం ప్రమదజలనిష్యందినయనమ్॥

ఆత్మానందంలో లీనమై కదలికలేని చిత్తరువువలె కన్పిస్తున్నవానిని, హిమాచల మందపవనానికి కేశపాశం కాస్త కదులుతున్నవానిని, కాంతితో మెరుస్తూ విశాల వక్షస్థలంతో పద్మాసనస్థుడై మనోహరంగా కన్పిస్తున్న వానిని ఆనందాశ్రువులు జలజలరాలే కన్నులతో ఎప్పుడు చూస్తాను?

72. కైలాసాచలమండనం గిరిసుతాకామానురాగాంకురం
భోగత్యాగనిధిం నదత్సురనదీగానైకలక్ష్యాయితమ్
కించిద్ధాససుధాతరంగితముఖం మందారమాలాయిత
ప్రేమోదారకటాక్షమాదిమగిరాం మాధుర్యమీడేమహి॥

కైలాస పర్వతానికి ఆయన ఒక అలంకారం. పార్వతీ ప్రేమభావానికి మూలం. భోగానికీ త్యాగానికీ నిధి. గంభీరనాదంతో ప్రవహించే గంగానది ఆయనను గూర్చియే గానం చేస్తున్నది. మందహాసామృతంతో ఆయన ముఖం వెలిగిపోతున్నది. ఆయన కటాక్ష వీక్షణాలు ప్రేమ భరితాలై, మందార మాలలను తలపిస్తున్నాయి. ఆయన, వేదవాక్కుల మాధుర్యం. ఆయనను స్తుతించుదము.

73. అస్తి వస్తు సురసుందరీకచ త్ర్యైకశ్యమాల్యాకలికావిచుంబితమ్।
యైస్తు భావితమిదం వినిర్జితం తైస్సహస్రజననార్జితం తమః॥

దేవతాస్త్రీ కేశభారంలో వెలుగొందే పుష్పకోరకాలు చుంబిస్తున్న వస్తువొకటి ఉన్నది. ఆ వస్తువును భావించి పొందినవారికి జన్మసహస్రాలలో సంచితమైన తమస్సు విడిపోతుంది.

74. రామనామజపకర్మఠే శివే
కేశవే శివజపానువర్తిని।
నారదాదిమునయస్తపోధనా
శ్శైవవైష్ణవభిదాం వితత్యజుః॥

శివుడు, రామనామ జప పరాయణుడు. కేశవుడు శివజపం చేస్తాడు. ఇది తెలిసిన తపోధనులైన నారదాదిమునులు శైవవైష్ణవ భేదాన్ని పరిత్యజించినారు.

75. నాగేంద్రోత్తంసచూడం నటదలకభరం నవ్యరాజీవనేత్రం
పీనస్కంధోరుబాహూ ప్రణవపరిచితం బిల్వమాలాభిరామమ్।
వ్యామగ్రాహ్యస్తనీభిశ్శబరయువతిభిర్వీక్ష్యమాణం సరాగం
కైవల్యాఽఽనందవేశ్మ ప్రవిశతు హృదయే కించిదద్వైత సీమా॥

మహాసర్పాలను జటాభూషణంగా ధరించి, కేశపాశాలు కదలగా, అప్పుడే వికసించిన పద్మాలలాగా కనులు వెలుగగా, సమున్నత బాహుస్కంధాలతో బిల్వమాలికలను ధరించి, పీనస్తనశోభితలైన శబరయువతులు ప్రేమావలోకనం చేయగా కైవల్యానందానికి స్థానభూతంగా, అద్వైతపరసీమగా ఒప్పారే వెలుగు నా హృదయంలో ప్రవేశించుగాక!

76. విమల లోచనం విషయమోచనం
విచలితాఽఽలకం విశ్వపాలకమ్।
భూతిశోభితం భూతసేవితం
చిదచిదాత్మకం శివముపాస్మహే॥

విమలమైన భావములతో బేసికన్నులతో కదలాడే జటాకలాపంతో భూతసేవితుడై చిదచిదాత్మకుడైన సంపన్మహితమూర్తియైన శివుని ఉపాసిస్తున్నాము.

77. పరమవైష్ణవం పార్వతీధవం
పరశుధారిణం బంధహారిణం।
మదవిఖండనం త్రిదశమండనం
పరపురంజయం ప్రభుముపాస్మహే॥

పరమవైష్ణవుడు, పార్వతీపతి, పరశుధారి, సమస్త బంధములను హరించువాడు, సకలగర్వాపహారి, దేవసమూహాలంకారుడు, శత్రువులపురములను జయించినవాడు. ప్రభువు. ఆయనను ఉపాసిస్తున్నాము.

78. ప్రమథనాయకం నయనసాయకం
దివ్యగాయకం దీప్తిదాయకమ్।
శమవిధాయకం సౌఖ్యనేయకం
మదనమర్దినం మృడముపాస్మహే॥

ఆయన ప్రమథులకు నాయకుడు. ఆయన చూపులు బాణాల్లాగా ఉన్నాయి. దివ్యగానాన్ని ఆలాపిస్తున్నాడు. దీప్తిని కలిగిస్తున్నాడు. శాంతిని అనుగ్రహిస్తున్నాడు. సౌఖ్యాన్ని ప్రసాదిస్తున్నాడు. మన్మథుని మర్దించినవాడు. అట్టి మృడుని (శివుని) ఉపాసిస్తున్నాము.

79. శ్రితదిగంబరం చికురితాంబరం కాలకంధరం భావబంధురమ్।
భువనసుందరం వైరిణాం దరం రతపురందరం హరముపాస్మహే॥

ఆయన దిగంబరుడు. ఆకాశాన్నంతా జటాజూటంగా మలుచుకొన్నాడు. నల్లనిమెడతో, భువనమోహనంగా, శత్రుసంహారం చేస్తూ ఇంద్రసఖుడై సకల భావస్థానమై ఒప్పారుచున్న హరుణ్ణి (శివుణ్ణి) ఉపాసిస్తున్నాము.

80. వేదబోధితం వినయసాధితం
జన్మతారిణం కర్మహారిణమ్।
విధిముఖామరైః సతతసంస్తుతం
విశ్వకారణం భవముపాస్మహే॥

వేదాలవలన ఆయన తత్త్వం అవగతమౌతుంది. యమనియమాదుల నాచరిస్తే ఆయనను సాధింపవచ్చును. ఆయన జన్మచక్రం నుండి విముక్తిని కలిగిస్తాడు. కర్మను హరిస్తాడు. బ్రహ్మాదిదేవతలు ఆయనను నిత్యం స్తుతిస్తారు. ఆయన విశ్వమునకు మూలకారణం. ఆ భవుణ్ణి (శివుణ్ణి) ఉపాసిస్తున్నాము.

81. గండోపాంతనికుంజితస్మితభరం కైవల్యభూషాయితం
వీణాగానరసాకులం గిరిసుతాఽఽ శ్లేషోత్సవాఽఽసంగినమ్।
ఢక్కానాదిత శబ్దశాస్త్ర విషయం ప్రాతస్సరస్సంచలత్
శ్వేతస్ఫీతకుశేశయోపమతనుం నాగేంద్రకృత్తిం నుమః॥

ఆయన చెక్కిలి చిరునవ్వుతో వెలుగారుతున్నది. కైవల్యం ఆయనకు భూషణం గా ఉన్నది. వీణాగానరసాస్వాదంలో లీనమై ఉన్నాడు. పార్వతీ పరిరంభంతో

ఆనందాన్ని పొందుతున్నాడు. ఢక్కను మ్రోగిస్తూ ఆ నాదంతో వ్యాకరణాన్ని సృజించినాడు. ప్రాతఃకాలవేళ సరోవరంలో కదలాడే విప్పారిన తెల్లని కమలపుష్పాల వంటి శరీరంతో శోభిస్తున్నాడు. ఆయన గజచర్మాన్ని ధరించినాడు. ఆయనను స్తుతిస్తున్నాము.

82. వీతరాగిణమముం నజానతీ
యౌవనోదయవిభిన్నమన్మథా,
తస్య నాట్యకలనాఽభికర్షితా
క్లిశ్యతే వనతలీషు కిన్నరీ॥

ఆయన విరాగి అని తెలియక, ఆయన నాట్యమునకు ముగ్ధురాలై యౌవనసహజమైన కామభావంతో వనతలంలో కిన్నరి క్లేశాన్ని అనుభవిస్తున్నది.

83. కుముదబాంధవహారిజటాయుతం
కువలయాఽవన ముగ్ధమృదుస్మితమ్,
గిరిసుతాప్రణయార్పితజీవితం
విజయతాం మమ వాఙ్మయవల్గితమ్॥

ఆయన జటలు వెన్నెలకాంతి నిండారి ఉన్నాయి. ఆయన చిరునవ్వు కమలపుష్పాల్లాగా మృదువుగా ఉన్నది. పార్వతీప్రణయానికి ఆయన జీవితం అర్పితమైంది. నా వాఙ్మయంలో నాట్యం చేసే ఆ మహస్సు విజయమగుగాక!

84. నయనైస్సురాంగనానా
అభిపీత మనుక్షణం స్పృహాతరళైః,
హిమనగసానువిహారే
విభావయే కిమపి కిమపి తారుణ్యమ్॥

దేవతాస్త్రీలు కోరికనిండిన తమ కనుచూపులతో అనుక్షణం అభిలషించేదీ, హిమాచలసానువులలో విహరించేదీ, వర్ణింపరానిదీ ఐన ఆ శివతారుణ్యాన్ని భావిస్తున్నాను.

85. తుష్టూషంతీ కించిదధ్యాత్మతత్త్వం
పారంపర్యం ప్రాక్తనానాం మునీనామ్,
ముగ్ధేవాంతర్లజ్జయా గాహ్యమానా
జ్ఞాతేఽప్యర్థే వాగ్విమూఢత్వమేతి॥

ప్రాచీన మునిపరంపరచే అనుగ్రహింపబడిన అధ్యాత్మతత్త్వాన్ని నిరంతరం స్తుతింపగోరుతూ, తెలిసిన విషయాన్నైనా వ్యక్తం చేయడానికి నిండినలజ్జతో వెనుకాడే ముగ్ధవలె నా వాక్కు విమూఢంగా ఉన్నది.

86. మధురిమకణికా మమాఽస్తు చిత్తే
మదనమహీపతిమానమర్దనశ్రీః।
మునిజనహృదయేషు శం దుహానా
రసతీ వా విధుచంద్రకం దధానా॥

అది మన్మథుని గర్వాన్ని మర్దించిన శుభకరమైనకాంతి. మునిజనులకు సౌఖ్యాన్ని కూర్చేది. చంద్రకళను ధరించేది. ఆ మాధుర్యలేశము నా చిత్తము నందుండు గాక!

87. ప్రణయలులితగౌరీపీనవక్ష స్థితాభ్యాం
ప్రతిపదలలితాభ్యాం పాటలీపాటలాభ్యామ్।
అతిమధురగతిశ్రీప్రస్నువత్పద్ధతిభ్యాం
శివపదనళినాభ్యాం చిత్తమాతుందిలం నః॥

ప్రణయంలో గౌరీస్తనాలను స్పృశించేవి ప్రతి అడుగునూ సున్నితంగా వేసేవీ, పొగడపూవులవలె ఎఱుపురంగు కలిగినవీ, అతిమృదువైన నడకతో మార్గంనిండా కాంతిని నింపేవీ ఐన శివపదకమలములతో నా మనస్సు నిండిపోయింది.

88. సన్నిధత్తాం హృది స్వర్ధునీకంకణ వ్రాతముక్తామయస్ఫీతజూటాంకితమ్।
కిన్నరీవల్లకీగానసంనాటితం భక్తివాఙ్మండనైర్జ్యోతిరాసేవితమ్॥

గంగానదీతరంగబిందువులే ముత్యాలుగా అలంకృతమైన జటాజూటంతో కిన్నరకాంతల వీణాగానానికి అనుగుణంగా నాట్యం చేస్తూ భక్తి స్తోత్రాలే భూషణాలుగా సేవింపబడే శివజ్యోతిస్సు నా హృదయమునందు వసించుగాక!

89. వక్షసి విపులం నయనే చపలం
హృదయే లలితం దయయా కలితమ్।
నిర్జరదయితాప్రణయప్రసరత్
స్మితపరిదిగ్ధం జ్యోతిరుపాసే॥

విశాలమైన వక్షస్థలంతో, చపలమైన నేత్రాలతో, దయాపరిపూర్ణమైన హృదయంతో, దేవకాంతల ప్రణయమందహాసంతో వెలుగొందే జ్యోతిస్సును ఉపాసిస్తున్నాను.

90. భక్తసారంగసంహ్లాది పరానందవధూద్వహమ్।
జ్ఞానోదయపరిస్ఫీతం భాతి శైవం సితాంబుజమ్॥

భక్తులనే తుమ్మెదలకు ఆహ్లాదం కలిగించేదీ, మోక్షకాంత తన కబరీభరంలో ధరించేదీ, జ్ఞానోదయం కాగానే వికసించేదీ ఐన శివరూప శ్వేతపద్మం వెలుగుతున్నది.

91. సమాధివిఘ్నాయ కదా ను మే భవేత్
అహీంద్రకోటీరవికాసి మస్తకమ్।
దయారసస్యంది విశాలలోచనం
ప్రసాదరమ్యాననమైశ్వరం మహః॥

మహాసర్పాలే కిరీటంగా ప్రకాశించే మస్తకంతో కృపాభరితమైన విశాల నేత్రాలతో, ప్రసన్నమైన ముఖంతో వెలుగొందే ఈశ్వరతేజస్సు అవిష్కృతమై నా తపస్సమాధిని ఎప్పుడు భగ్నం చేస్తుందో?

92. కష్టముష్టింపచః కోఽపి సంవర్తతా
మార్ద్రమంజుస్మితస్విన్నగండస్థలః।
సంయమివ్రాతవాటీషు యో యాచతే
ప్రేమభిక్షాం ధురి ప్రేయసీవంచితః॥

సుకుమారమైన మందహాసంతో, ప్రేయసీవంచితుడెవడో నిష్కించనుడై మునివాటికల ద్వారసీమల ముందు ప్రేమభిక్షను యాచిస్తున్నాడు. ఆయన నా ముందు కన్పించుగాక!

93. నాహం శక్తో వినిర్జేతుమింద్రియగ్రామముద్ధురమ్,
సుఖీ సుఖే తు నిక్షిప్యే లేశం పైనాకతేజసః॥

బలమైన ఇంద్రియ సమూహాన్ని జయించే శక్తి నాకు లేదు. సుఖినై నా సుఖంలో ఆ శివతేజస్సును కాస్త నిలుపుకుంటాను. (నిక్షేపిస్తాను)

94. చుంబతు మన్మతిమాదర
చుళుకితనయనో భుజంగకోటీరః।
వ్యపనీయ మానవసనం
ప్రతిపదమనువర్తిముక్తిశృంగారః॥

సర్పాలే కిరీటంగా వెలుగొందే ఆ స్వామి సాదరముగా నా మనస్సును స్పృశించుగాక! శృంగారపరవశమై ముక్తికాంత లజ్జనువదిలి ఆయనవెంట అడుగులో అడుగునిడుతూ నడుస్తున్నది.

95. సోఽయం లయాఽనుగుణవర్తిత పాదపద్మ
మంజీరమంజుతరపుంజితశింజితేన।
మూర్ధాభిషిక్తపదవీం శ్రవసోర్వితన్వ
న్నానందవార్ధిరివ మానసమభ్యుపైతి॥

లయానుగుణంగా పాదపద్మాలను కదిలిస్తూ మధురమైన అందెల సవ్వడితో వీనులకు మూర్ధాభిషేకపదవిని కలిగిస్తూ ఆనందసముద్రం వలె ఈయన నా మనస్సును నిండిపోయినాడు.

96. గౌరీనఖముఖరిత
వీణాగానానురూపభావభరమ్।
నందివిమర్దితమర్దల
మసృణితమానందరూపమాయాతి॥

పార్వతీదేవీ వీణాగానమునకు అనుగుణమైన భావమును మనస్సున నింపుకొని నందీశ్వరుడు మ్రోయించిన మద్దెలసవ్వడికి ఆనందమునందిన ఆ శివుడు (నన్ను) సమీపిస్తున్నాడు.

97. మమ వర్త్మని ఖేలతాం విభు
ర్మదరాగాఽఽకుల గండమండలః।
మదయన్ మమ మానసం ముహు
ర్ముహురాశ్లేషసుఖోపబృంహితమ్॥

మాటిమాటికీ నా మనస్సుని ఆలింగనం చేసి మైమరిపిస్తూ చెక్కిళ్ళపై మదరాగం ఒప్పారగా, నా మార్గము నందు శివుడు క్రీడించుగాక!

98. పంచాక్షరీపరమపావనమంత్రవర్ణ
తల్పస్థితే విమలశీతలదేహగేహే।
నిర్వాణసీమ్ని మమ జీవితరంగనాథే
ప్రాదుర్భవంతి ధురి చేతసి కేఽపి భావాః॥

పరమపవిత్రమైన మంత్రాక్షరాలతో వెలుగొందే పంచాక్షరియే తల్పంగా ప్రశాంతమైన దేహమనే ఇంటిలో నా జీవితరంగానికి అధినాథుడై మోక్ష సీమగా ఒప్పారు ఈశ్వరుని సన్నిధిలో నామనస్సునందు వివరింపరాని భావాలు ఉద్భవిస్తాయి.

99. మస్తన్యస్తసుధాంశుహస్త విగలత్పీయూషధారాభరో
బాహూదీర్ణపృదాకునాయకశిరోమాణిక్యనీరాజితః।
ప్రేమార్ద్రాచలనందినీస్మితఝరీరోచిస్సమాలింగితః
కోఽయం కైతవభిక్షుకో హిమగుహావీథీమితో గాహతే॥

జటాతలంలో నడయాడే చంద్రునికిరణాలు అమృతధారను నింపగా, బాహువులపై ఆభరణాలుగా ఉన్న మహాసర్పాల శిరస్సులపై వెలిగే మణులు నీరాజనవిధిని నిర్వహింపగా, పార్వతీమందహాసకాంతి శరీరాన్నంతా వ్యాపించగా ఈ కపటభిక్షువు ఎవడో హిమాచల గుహల్లో తిరుగాడుచున్నాడు.

100. ఉదీతే కాకోలే జలధిభరితే ధూమపటలీ
సురాణాం సందోహేఽవితథబలహాహారవయుజి।
తదా సంజగ్రాహ ప్రథితమహిమా యో హలహలం
ధునోతు ధ్వాంతం నస్సకలజగదీశః పశుపతిః॥

సముద్రాన్ని కప్పివేస్తూ దట్టమైన పొగ వ్యాపింపగా, దేవతలందరూ హాహాకారాలు చేస్తూ ఉండగా, కాకోల విషం ఉద్భవించింది. ఆ హాలాహలాన్ని మహామహిమాన్వితుడైన ఈశ్వరుడు తనలోనికి లాగుకున్నాడు. సకలజగదీశుడైన ఆ పశుపతి మన హృదయములందున్న చీకటిని పారద్రోలుగాక!

101. కల్యాణానాం నిధానం వసనితగగనం గండసంభిన్నహాసం
చంచచ్చంద్రాభిరామం శ్రుతిశతయువతీదోహదం రాగహేతోః।
మూలం ధర్మద్రుమస్య ప్రసృమరకరుణం ముక్తికాంతాభుజంగం
తం వందే నీలకంఠం మదనమదహరం మాధురీస్థానమేకమ్

ఆయన కల్యాణనిధి. ఆకాశాన్ని అంబరంగా ధరించిన వాడు, గండస్థలంలో మందహాసంతో ఒప్పారేవాడు, వెలుగొందే చంద్రవంకతో అందంగా కన్పించేవాడు, ఉపనిషత్కాంతలను, రంజింపచేసేవాడు, ధర్మవృక్షానికి మూలమైనవాడు, దయారసాన్ని పై జల్లెడువాడు, మోక్షకాంతాప్రియుడు. మన్మథుని మదాన్ని హరించినవాడు. మాధుర్యగుణమునకు స్థానమైన వాడు. ఆ నీలకంఠునికి నమస్కరించుచున్నాను.

102. హైమవతీమణికాంచీ కలకింకిణినాదసుభగదరహాసమ్।
పూర్వాఽర్ధభాగ పర్యా క్రమణోత్సుకవామమీశ్వరం వందే॥

ఆయన దరహాసం పార్వతీదేవి ధరించిన కాంచీదామమణికింకిణీనాదంవలె మనోహరంగా ఉన్నది. అర్ధనారీశ్వర రూపంలో పూర్వభాగాన్ని వామభాగం ఆలింగనం చేసికొనుటకు ఉత్సాహపడుతున్నది. అట్టి ఈశ్వరునికి నమస్కరించుచున్నాను.

103. అధీతమపి యచ్ఛాస్త్రం నాధీతమివ భాసతే।
యస్య తత్త్వావబోధేన తం నుమస్సర్వరూపిణమ్॥

ఎవని తత్త్వాన్ని తెలుసుకుంటే, శాస్త్రాధ్యయనం యావత్తూ అనధీతప్రాయమై అప్రకృతమౌతుందో అట్టి సర్వస్వరూపుని స్తుతించుదము.

104. ఆప్యానజూటపరికీలితగాంగనీర
తారంగగీతసుఖకుట్మలితాబ్జనేత్ర!।
శ్రీచంద్రశేఖర! దయాఫలితావతార!
కైవల్యపూర! కృపణే కరుణాం విధేహి॥

లావైన జటలమధ్య బిగించిపట్టిన గంగాజల తరంగధ్వని గీతానికి పరవశించి అరమోడ్పుకనులతో ఆనందించే దయాపూర్ణుడవైన చంద్రశేఖరా! మోక్షదాతా! ఈ దీనుని దయతో వీక్షించు.

105. అధీనం సాహిత్యం కఠినతపసా లబ్ధమతులం
కవిత్వశ్రీర్వశ్యా సరసతరశబ్దార్థసుభగా।
విభాతి స్వచ్ఛందా మతిరపి చ శాస్త్రేష్వతితరాం
పరం శాంతిశ్శంభో! కృపణమనసా నాధిగమితా॥

శివా! కఠినమైన తపస్సుతో అసమానసాహిత్యం స్వాధీనమైంది. రసాన్వితములైన శబ్దార్థాలతో సుందరమైన కవితాసంపద వశమైంది. శాస్త్ర విద్యాకౌశలం పట్టువడింది. కాని ఈ దీనునికి శాంతి సమకూడలేదు.

106. రత్నాంచితాంగద యుగీముఖరీకృతాంఘ్రిం
వాచ్యార్థకల్పన విధౌ కలితాబ్జహస్తమ్।
భావానురూపపరికంపితతారహారం
సంధ్యాప్రవర్తి శివతాండవమాద్రియామః॥

రత్నాంగదాల ధ్వనిచే విలసిల్లేపాదాలతో వాచ్యార్థాన్ని అభినయించే హస్త పద్మాలతో భావానురూపంగా కదులుతున్న తారహారాలతో ఒప్పారే సంధ్యాకాల శివతాండవాన్ని స్తుతించుదాం.

107. సంపుల్లస్థల పద్మాభౌ
వుత్తానస్థాన శోభినౌ।
సమాధిస్థమహేశస్య
కరౌ తామ్రతలౌ నుమః॥

సమాధిస్థుడైన శివుని విప్పారిన హస్తాలు సంపూర్ణంగా వికసించిన మెట్ట తామరల వలె తామ్రవర్ణంతో శోభిస్తున్నాయి. వాటిని స్తుతించుదాం.

108. ఉత్తానతార తరళం
నిశ్చలీకృతమండనమ్।
చిత్రీకృతశరీరం త
చ్ఛివధ్యానసుఖం స్తుమః॥

ఊర్ధ్వ దృష్టితో ప్రకాశిస్తూ చిత్తరువులోవలె నిశ్చలంగా ఉన్న శివుని ధ్యాన సుఖాన్ని స్తుతించుదాము.

109. ఆత్మానమాత్మనావేక్ష్య
విహసంతం ముహుర్ముహుః।
ముకుళీకృత నేత్రాబ్జం
ఆదిదేవముపాస్మహే॥

స్వాత్మావలోకనంలో ఆనందమందహాసంచేస్తూ నిమీలితనేత్రుడైన ఆది దేవుని ఉపాసించుదము.

110. దాక్షాయణీకుచతటీకృతపత్రభంగ
సంక్రాంతిపల్లవితమాంసలపీనవక్షాః।
రక్షాపరో గుణవతాం చ సురాసురాణాం
శంభుః పునాతు శ్రుతిగీర్వనితావసంతః॥

పార్వతీస్తనపత్రభంగసంసర్గంతో ఆయన వక్షస్థలం ఎరుపెక్కింది. దేవరాక్షసు లను, గుణవంతులను రక్షిస్తాడు. వేదసరస్వతికి వసంతంలాంటివాడు. అట్టి శంభుడు (మనలను) పావనం చేయుగాక!

111. నందీశ్వరప్రహితచాటుకథానుకూల
సంచాలిమస్తకనటన్మృదుచంద్రరేఖమ్।

రేఖారథాంగసరసీరుహముద్రితాంఘ్రిం
భూతేశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥

నందీశ్వరుని స్తుతిగీతాలను వింటూ ఆనందంతో శిరఃకంపనం చేస్తున్నాడు. అందుకే శిరస్సుపై నున్న చంద్రరేఖ కదలాడుచున్నది. కమలము రథాంగము ఆదిగాగల శుభకరమైన సాముద్రిక రేఖలతో ఆయన పాదాలు శోభిస్తున్నాయి. ఆయన భూతేశ్వరుడు. ఆయనను నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?

112. దంతావళాసురతనుస్రుత శోణశోణి
తాఽఽఽక్తం కపోలయుగళం దధతం పురాణమ్।
బీభత్సకాంతమమరీకృతచాటువాదం
సర్వేశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥

గజాసురుని సంహరింపగా చిమ్మిన రక్తంతో ఆయన కపోలాలు తడిసి ఎఱ్ఱనైనాయి. రూపం బీభత్సంగా కన్పిస్తున్నది. దేవతాస్త్రీలు స్తోత్రపాఠాలను గానం చేస్తున్నారు. ఆయన సర్వేశ్వరుడు. ఆయనను నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?

113. హేరంబలంబశ్రుతిశూర్పరతాళవృంత
సంజాతవాతవిధుతాఽలకకేశభారమ్।
మారాంకురగ్రసనభాస్కరఫాలనేత్రం
గౌరీశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥

గణపతి శూర్పకర్ణాలతో విసరగా ఆగాలికి ఆయన జటాజూటం కాస్త కదులుతున్నది. ఆయన మూడవకంటి వలన కలిగిన మండుటెండ మన్మథుడనే అంకురాన్ని మాడ్చివేస్తున్నది. ఆయన గౌరీపతి. ఆయనను నేనెప్పుడు దర్శించుకో గలుగుతాను?

114. కల్పద్రుపల్లవసదృక్ఛవిమత్కటాక్ష
విభ్రాంతకోణపకరాంజలియుక్తపాదమ్।
యోగీశ్వరాఽభ్యుదితహర్షితసామవేదం
నాదేశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥

కల్పవృక్షం చివురుటాకుల కాంతికలిగిన కటాక్షాలకు విభ్రాంతులైన రాక్షసులు ఆయన పాదాలకు అంజలి ఘటిస్తున్నారు. యోగీశ్వరులు ఆనందంతో సామగానం చేస్తున్నారు. నాదేశ్వరుడైన ఆ శివుని నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?

115. గజాసుర మహాదంత
కుంతబాధాం వినిర్మమే।
యస్యాట్టహాసప్రచయా
స్తం స్మరామో మహానటమ్॥

ఆయన అట్టహాసాలు గజాసుర మహాదంతంతో ఏర్పడిన పోటుబాధను వ్యక్తం చేస్తున్నవి. అట్టి మహానటుని స్మరించుదాం.

116. పతతు నభస్స్ఫుటతు మహీ
లుఠంతు గిరయశ్చలంతు వారిధయః।
వయమద్య న భీతాః
కాశీపతిరస్తి కా శుచా మనసః॥

ఆకాశంపడిపోనీ, భూమి ముక్కలు కానీ, పర్వతాలు జారపోనీ, సముద్రాలు కదిలిపోనీ, మేమిప్పుడు భయపడం. కాశీపతి ఉండగా మనస్సుకి బాధ ఎక్కడిది?

117. కామినీగండ యుగళీ
పాండోర్నిజతనుత్విషః।
సంస్మరామః పురారాతేః
పునరుక్తీకృతం స్మితమ్॥

ఆయన శరీరకాంతి కామినీగండస్థలంవలె తెల్లగా ఉన్నది. ఆయన మందహాసం ఆ తెల్లదనాన్ని ద్విగుణీకృతం (పునరుక్తం) చేస్తున్నది. ఆ పురారాతిని (శివుణ్ణి) స్మరించుదాం.

118. యా ప్రేమమండనవతీ కృపయా సనామ్నీ
మచ్చిత్తసీమ పరతత్త్వమయం చకార
తాం మన్మహే వికసితోత్పలపత్రలీలాం
సాధారసీమభినవామివ తుల్యశీలామ్॥

ప్రేమయే అలంకారంగా, దయయే పేరుగా, అమృతరసంవలె మధుర స్వభావమై వికసించిన కమలపుష్పములవలె మనోహరంగా ఉన్న ఆ శివతత్త్వాన్ని భావిస్తున్నాను.

119. వర్ధతాం శివసాహిత్య మాకల్పం నిర్నిబంధనమ్
సాయంకాలసమాపుల్లమల్లీపుష్పోపమద్యుతి॥

సాయంకాలంలో వికసించిన మల్లెపూవులవలె వెలుగొందే శివసాహిత్యం స్వతంత్రంగా కల్పాంతందాకా వర్ధిల్లుగాక!

120. శివేన దత్తం సాహిత్యం
శివాయైవ నివేదితమ్।
వర్షంతి హి పయో మేఘాః
పునస్తత్రైవ వార్ధిజమ్॥

సముద్రం నుండి జలాన్ని గ్రహించి మేఘాలు మళ్ళీ అక్కడే వర్షించినట్లుగా శివుడనుగ్రహించిన సాహిత్యాన్ని శివునికే నివేదించినాను.

121. అష్టాక్షరీజపరాయణమానసేన
శైవాగమాఽఽకలనపుంభితసంభ్రమేణ।
నారాయణేన రచితం నవచంద్రభూష
కర్ణామృతం జయతు కామగవీసదృక్షమ్॥

అష్టాక్షరీ జపపరాయణ మనస్కుడు, శైవాగమాలను ఆపోశనం పట్టినవాడు అన నారాయణుడు వ్రాసిన ప్రతిపచ్చంద్రకలాశోభిత శివకర్ణామృతము కామధేనువు వంటిది. జయించుగాక!

